ఓం.

# విజ్ఞానారాధనము



## మానసపూజ.

శ్రీమతి రాజాంబ,

శ్రీమాన్ శిరోమణి

టి. వి. వరదాచార్యులు,

హిందూపురం

[ వెల అమూల్యము.

సత్యం శివం శాంతం

శ్రీ పరం(శ్రీ)జ్యోతిషేనమః

# వి జ్ఞా నా రా ధ న ము

## (మా న స పూ జ)

శ్రీ మద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాన్త ప్రవర్తకాచార్యులగు, శ్రీమార్గ శిరోమణి టి. వి. వరదాచార్యుల సతీమణి రాజాంబచేతను, వారి బిడ్డలచేతను, రచింపబడినది. ఆచార్య శిరోమణిగారిచే పరిష్కరింపబడినది. సర్వోపనిషత్సారము, భక్తి ముక్తి సంధాయకము ।

 [వెల అమూల్యము

శ్రీః

శ్రీ వత్సవంశకలశోదధి పూర్ణచంద్రం,
శ్రీ రంగసూరికృపయాధిగతాత్మమంత్రం ।
శేషాంబికా హృదయనందన పారిజాతం
నారాయణార్య తనయం వరదం భజేహం ॥

భగవదంశసంభూతులగు, ఈ దివ్యదంపతులయందు, గురు భావముగలిగి, శ్రద్ధాభక్తులతో ఈ మానసపూజను వారమునకు, ఒక దినమైనను లేక 15- దినములకు ఒకదినం ఏకాదశినాడైనను చేసెదను

దినదినము వీలున్నంతవరకు ఈ పుస్తకమునందు 2-3 గీతములైనను, పఠించెదను

ఇట్లు,

భగవద్విధేయులు.

సర్వేజనాః సుఖినోభవంతు ।

శ్రీ శ్రీ శ్రీ



టి. వి. వరదాచార్యశిరోమణి-సతీమణి రాజమ్మ.

శ్రీః

# మానసపూజ (విజ్ఞానారాధనం)

ఓం శ్రీ పరంజ్యోతిషేనమః ।
శ్రీమతే రామానుజాయనమః ।
శ్రీమద్వరవర మునయేనమః ।
శ్రీ నిగమాన్త మహాదేశికాయనమః ।
శ్రీమతే వరదార్య మహాగురవేనమః ।
శ్రీ రంగనాథమహాగురవేనమః

## సుప్రభాతము.

జ్ఞానభాస్కరుడు తూరుపుకొండల, శిఖరము జేరుచునున్నాడు । లోపలచీకటి మెల్ల మెల్లగా, చల్లగజారుచునున్నయది ॥

అష్టకమలములు నగుమొగములతో, ధ్యాన మరందము గురిసెడిని। దేవగణంబులు బద్ధాంజలులై, పూజకునిలబడి యున్నారు ॥

శుద్ధాన్తంబున శేషశయ్యపై, యోగనిదురలోనున్నట్టి । మా మా రమణా మాతో మేల్కొని, మాదు పూజలను గైకొనుమా ॥

వెన్నునివలపలి యురమునహాయిగ, నిదురంబోయెదు మాలచ్చి । నీసుఖశయనము నడుగుటకదిగో, పాడుచునున్నవి కోయిలలు ॥

నీకుస్వాగతము నొసగుటకొరకై, మందమారుతము వీచెడిని । తరువులు తీగెలునగుమొగములతో పువ్వులు జల్లుచునున్నయవి ॥

సుప్రభాతమును బాడుచునున్నవి, మంగళగీతంబులతో డర్ల । కలువులతల్లీ, నీకాన్తునితో,

మేలొ్కని పూజలగై కొనుమా ॥

దర్పణం।

ఇదిగో నాదగునిర్మలచిత్తము, నిలువుటద్దముగ గ్రహించి। నీదివ్యంబగు మంగళరూపము జూచిముదంబున మముజూడు ॥

లక్ష్మీవిభ్రమ దర్పణమగునీ, కౌస్తుభమణిలో జూచుకొని। మాస్వరూపమును చక్కగగనుగొని, నీదుపూజలను జేయుదుము ॥

(పంచ పాత్రములు)

నాదుమానసమునర్ఘ్యపాత్రగను, చిత్తము పాద్యపుపాత్రగను। బుద్ధినినాచమనీయపాత్రగను, స్నానీయంబున హాంకృతిని ॥

ప్రత్యగాత్మయను చిన్మయ రూపుని, శుద్ధ జలంబులపాత్రగను । ప్రాణమయంబగుదివ్య కోశ మును, ప్రతిగ్రహపాత్రగనుంచుకొని ॥

సుషుమ్న యనిమెడు తొండముగలిగిన, హృదయము జలకుంభంబుగను । గైకొనినీదగు దివ్యారాధన జేసెద సేవల జేకొనుమా ॥

విరజానదిలో దివ్యజలంబుల, నన్నిటసొంపుగనేనింపి । జ్ఞానభక్తులను కేసరికర్పూరాది సుగంధంబులనుంచి ॥

ఇంపుమీరగా నీయారాధన, జేయుటకందర మెఱుదెంచి । నీయనుమతికై వేచియుంటిమిక, దేవా(దేవీ)పూజల గైకొనుమా ॥

## సంకల్పము.

దేవుడొసంగిన దేహముగైకొని, దేవుడు

జెప్పినమంత్రములఁ। దేవుఁడొసంగినయుపకరణం
బుల, దేవుడుతానే తనకొఱకు ॥

తనదుపూజలను నాధస్యత్కై, ప్రేమ తో
నా చేచేయించుఁ। ఇందునవాకిక నేమాత్రంబును
స్వార్థము స్వాతంత్ర్యము లేదు ॥

సర్వజ్ఞుండును సర్వశక్తుడగు, దేవుడునాకిట
గురువగుఁ। జంకొకయించుక లేకనుహాయిగ,
పూజలజేసెద నిర్భరుడై (నిర్భరమై)॥

## ధ్యా న ం.

శ్రీ భగవన్నారాయణాభిమతానురూప,
స్వరూప రూపగుణ విభవైశ్వర్య, శీలాద్యన
వధికాతిశయా సంఖ్యేయ, కల్యాణగుణగణాం,
పద్మవనాలయాం, భ గ వ తీ ం, శ్రియం దేవీం,

నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవ దివ్య మహిషీం, అఖిలజగన్మాతరం, అస్మన్మాతరం, అశరణ్యశరణ్యాం, అనన్యశరణఃశరణమహం ప్రపద్యే ।

విరాజన్తమేనం హృదన్తర్మహాన్తం, సుశాన్తే సచిత్తేనసంసారశాన్తే। సదాధ్యానయోగేముదా ధారయంతః ప్రమోదామహే వాసుదేవం ధరాయాం ॥

హృద్యపంకజ సంభవాం, విమలేన్దుమండల సన్నిభాం। చిన్మయాభరణైర్విరాజితపాణి పద్మ చతుష్టయాం । నీలతోయదమధ్యసుస్థిర, విద్యుదుజ్వలరూపిణీం, భావయామి హృదంబుజే, మమమాతరం స్మితచంద్రికాం ॥

## పుష్పాంజలి

ఆత్మారామమునందలిసద్గుణ, కుసుమము
లెల్లనువిడిపించి । జ్ఞానభక్తిసంఘటితాంజలియం,
దమరగపదిలంబుగనుంచి ॥

హృదయకమలమను దివ్యపీఠమున, చక్కగ
నెలకొనియున్నట్టి। నీదివ్యంబగు నడుగుదామరల,
కిదెకుసుమాంజలి నర్పింతుగా ॥

## అర్ఘ్యం

నాచిత్తంబను చంద్రకాన్తమణి, శాంతి
సుధాకరు కిరణములగా । కరిగి ద్రవించెడు దివ్య
జలంబుల, నీకభిషేకమునర్పింతుగా ॥

## పాద్యం

నీగుణగణములు వినుటగా గలిగిన, భక్తియ
నంబడుసెలయేటిగా । నీపదంబులకు పాద్యరూప

మునసర్పణజేసెద గైకొనుమా ॥

ఆ చ మ నీ య ం

నాహృదయంబున నెలకొనియుండెడు, ధ్యాన మరందపు కణములను । నీకుఁబ్రేమతో నాచ మనీయంబిదె నేనొసగెద గైకొనుమా ॥

స్నా న ం (అభిషేకము)

మానసమని యెడు సరోవరంబున, శమదమ పరిమళమిళితంబై । జ్ఞానజలంబుల నీకభిషేకము జేసెదజలకములాడుము రా ॥

గలగలగద లెడు రాజహంసలతో, నిడయను నాడిఁబ్రవహించు । మ ం దా కి ని లో దివ్య జలంబుల, నీకభిషేకము నర్పింతుఁ ॥ పింగళ యని యెడుసూర్యనాడిలో, ని గ ని గ లా డు చు

ప్రవహించు, యమునానదిలో దివ్యజలంబుల నీకభిషేకము నర్పింతుగా ॥ గంగాయమునల మధ్యభాగమున, యోగిగమ్యమై యున్నట్టి। సుషుమ్నయనియెడు నాడిలో బారెడు, వాణీజలములనాడుమురా ॥ సరస్వతీనది గంగాయము నల, కలసెడుసంగమ స్థానమునగ । ధ్యానప్రవాదంబున జ్ఞానజలంబుల నీకభిషేకమునర్పింతుగా ॥ హృదయమునుండియు వెలువడుచుండెడు, నూరునాడులంప్రవహించు, దివ్యనదులలో నీకభిషేకము జేసెద జలకములాడుమురా ॥

శంఖాభిషేకము

నాదుకంఠమను వలమురిశంఖము, నందలివి శుద్ధకమలమునగ । నెలకొనియుండెడు ధ్యానామృతముల నీకభిషేకము నర్పింతుగా ॥

## వస్త్రం

శుద్ధసత్వమయ గుణగణంబులచే । బాగుగ నేయంబడినట్టి । రేఖామాత్రరజోగుణంబుచే, నంచులమించుచున్నట్టి ॥ రంగులు మీరిన యంగవస్త్రమును, పచ్చని పసిండిధోవతియుఁ । నీకుఁ బ్రేమతో ధారణజేసెద, దేవా(దేవీ)దయతో గైకొనుమా ॥

## ఆసనం

నాభికి బెత్తెడుపై భాగంబున, నూర్ధ్వముఖంబై యున్నట్టి । అష్టదళంబుల కమలమధ్యమున, కర్ణికనీకిదె యాసనము ॥

## యజ్ఞోపవీతం

షణ్ణవత్యాత్మక గుణత్రయంబుల, బ్రహ్మగ్రంధిలో, బిగియించి । శుద్ధసత్వమయములు

గంజేసిన, యజ్ఞసూత్రమునుసర్పింతుర ॥

ఆ భ ర ణ ం

విజ్ఞానంబను చొక్కపుబంగరు, వివిధాభర ణంబులయందు । నవవిధంబులగు భక్తి రత్న ముల నింపుమీారగాబిగియించి ॥

తళతళ మెరసెడు హారనూపురాద్యాభర ణంబులముదమలర । నీకుర్ప్రేమతో ధారణ జేసెద దేవా(దేవీ)దయతో గైకొనుమా ॥

గ ం ధ ం

హృదయఫలకమను సానరాతిపై, ద్వయ మంత్రంబును గ్రహియించి । గిరగిరనటునిటు త్రిప్పగగలిగిన, శాంతిగంధమును సర్పింతుర ॥

పు ష్ప ం

హృదయారామము నందునబెరిగెడు, జ్ఞానభక్తి

లను తరులతలన్ । అతిగహనంబగుకర్ణకుంజ ములు, నింపుమీరగా వికసించి ॥ కళకళలాడెడు వివిధ వర్ణ ములు, నానార్థములను కేసరముల్ । వివిధభావములు, వివిధగంధములు, వివిధరసము లను పూదేనెల్ । మెండుగగలిగిన వాక్కుసు మంబుల, పూజలజేసెద గైకొనుమా । ఇట్టి పూలతో సొంపుగగట్టిన పా ట ల ద ం డ న నర్పింతున్ ॥

—: మా లా :—

ఆత్మారామమునందుదయించిన, విద్యాలత లందలరారు । వివిధవర్ణములదళములుగలిగిన, వివిధనామముల కుసుమములన్ ॥

భక్తిసూత్రమున బాగుగగూర్చిన, వాడని పాటలదండలను । ఇంపుమీరగాధారణఁజేసెద,

సొంపుగ దేవా(దేవీ) చేకొనుమా ॥

1 కమలపాదాయనమః పాదౌ పూజయామి
2 మంజీరాలంకృతాయనమః గుల్ఫౌ
3 సుందరజంఘాయనమః జంఘే ,,
4 జానుముకురాయనమః జానునీ ,,
5 సుందరోరుయుగళాయనమః ఊరుయుగళం పూజయామి
6 సింహమధ్యాయనమః కటిం ,,
7 పద్మనాభాయనమః నాభిం ,,
8 శ్రీనివాసాయనమః వక్షస్థలం ,,
9 కంబుకంఠాయనమః కంఠం ,,
10 సుందరచుబుకాయనమః చుబుకం, ,,
11 విద్రుమాధరాయనమః అధరం ,,
12 కమలవదనాయనమః వదనం ,,

13 పంకజనాసికాయనమః నాసికాం పూజ।
14 పుండరీకాక్షాయనమః నేత్రే ,,
15 పరంజ్యోతిషేనమః భ్రూమధ్యం ,,
16 భువనమోహనాయనమః భ్రూయుగళం
17 స్ఫురల్లలాటాయనమః లలాటం ,,
18 కస్తూరీతిలకాయనమః తిలకం ,,
19 కుటిలకుంతలాయనమః। కుటిలకుంతలాన్
పూజయామి
20 హృషీకేశాయనమః శిరః ,,
21 జగదీశ్వరాయనమః కిరీటం ,,
22 ఆజానుబాహవేనమః బాహుయుగళం
23 జగదాధారాయనమః పాదపీఠం ,,
24 సర్వాంగసుందరాయనమః సర్వాంగాణి
పూజయామి

## ధూపం.

బహుజన్మంబుల నుండియుమూచే, నార్జిత పుణ్యసుగంధములన్ । జ్ఞానానలమునహోమము జేయగ ధూమముధూపము గైకొనుమా ॥

## దీపం

ప్రత్యగాత్మనొకయరణిగ గైకొని, ప్రణవము మరియొక యరణిగను। ధ్యానమథనమున గలిగిన జ్యోతిని, దివ్యదీపముగనర్పింతున్ ॥

## నైవేద్యం

శమదమాదులను నారురసంబుల, నానారుచులతో నలరారు । వివిధకర్మలను భక్ష్యగణంబుల మంత్రయోగమను చోష్యములన్

జ్ఞానయోగమనుఖాద్యగణంబుల, భక్తియోగమను భోజ్యములన్। నాలుగురకముల దివ్యా

న్నంబుల, నై వేద్యంబుగనర్పింతుర ॥ వైశ్వా
నరుడవై మాలోనెలకొని, యారగింపరా
గోపాలా ॥ ప్రేమమీరగా మాయందరితోకలసి
భుజింపర గోవిందా (వేశ్రీలక్ష్మ) ॥

## పంచామృతం

పంచోపనిషన్మయమై వెలసెడు, దివ్యా
ద్భుతమగు రూపమును। ముట్టి మూర్కొనుచు
కనివిని తినుటచే, కలిగినభక్తిరసంబులను, పంచా
మృతముగనీకునొసంగెద, నీవుర పంచప్రాణంబై।
పానముజేయుచు నాప్రాణంబుల, బ్రహ్మమ
యంబుగ జేయుమురా ॥

## ఫలం.

దయయును, దానము, సత్యాహింసలు,
వాత్సల్యంబును ప్రేమయును,। కదళీద్రాక్షా

పనసామ్రంబులు, మొదలగు పండ్లుగ
గైకొనుమా ॥

పానీయం

వేదములనియెడు దివ్యనదులలో, నెడతెగ
కుండగ ప్రవహించు । విజ్ఞానంబుల శాస్త్ర
వాసనల ఘుమఘుమలాడుచునున్నట్టి । శాంతి
సుశీతల, హిమఖండంబుల, సుఖశీతలము గ
నున్నట్టి । దివ్యజలంబుల పానీయంబుగ నీకు
నొసంగెద గ్రావుమురా ॥

తాంబూలం

కర్మేంద్రియములు తమలపాకులుగ, జ్ఞానేం
ద్రియముల పోకలుగ । శుద్ధచిత్తమును గవ్వ
సున్నముగ, సుగుణగణంబుల పరిమళముగ ॥
చేరిచి చక్కగ విజ్ఞానంబను, చంచపు రేకులతో
జుట్టి । ఘుమఘుమలాడెడు తాంబూలంబును
నీకునొసంగెద నములుమురా ॥

హారతి

నాదుబుద్ధి యనుసూర్యకాన్తమణి, జ్ఞానభా
స్కరునికిరణములఁ । ప్రజ్వలుచుండెడు దివ్య
జ్యోతిని, కర్పూరారతి సర్పింతుఁ ॥

కుంభారతి

హృదయకోశమను, బంగరు ఘటమున, భక్తి
యోగమనునెయ్యుంచి । శుద్ధచిత్తమను వత్తితో
వెలిగెడు కుంభహారతిని సర్పింతుఁ ॥

ఛత్రం

బ్రహ్మదండియను స్వర్ణదండమున, వేయిశలా
కలుగలయట్టి। వేయిదళంబుల దివ్యకమలమును,
ధారణ జేసెద ఛత్రముగఁ ॥

చామరం

వైరాగ్యంబను బంగరుపిడిలో, బాగుగ
నమరికగలయట్టి। జ్ఞానభక్తులను వింజామరముల,
వీచెద సేవల గైకొనుమా ॥

వ్య జ న ం

వాయ్వంశంబై క్రిందికిమీదికి । నిటు నటు నంతట నెడ తెగకర్ । దిరుగుచునుండెడు మానస మనియెడు దివ్య వ్యజనమున వీచెదను ॥

ఇందునందుమరి ఇటు నటు నం త ట, నిండి మెండుగానీవుంటర్ । నాదు మానసమదెందు బరుగిడిన, నీ యందే యెప్పుడుండునురా ॥

మ ం త్ర పు ష్పం

నాహృదయాంబను నాలవాలమున, రూఢ మూలమైయున్నట్టి। ఉపనిషత్తులను మల్లెతీగెలో, నింపుమీరగా వికసించి ॥ కళకళలాడెడుమంత్ర పుష్పముల, నతిరమ్యంబుగ నేగూర్చి । మంత్ర పుష్పముగ నీకర్పింతును, ప్రేమతో దేవా(వీ) గైకొనుమా ॥

ఓంనమోభగవతే వా సు దే వా య ని, ఓంనమోనారాయణ యానియుర్ । ఓంనమో

విష్ణవే ఓం శ్రీం హ్రాం అను, మంత్రరాజముల
నర్పింతురా ॥

మంగళహారతి

ఈమూడులోకములను, ముద్దుగ గాచినట్టి
నీపాదపద్మములకు నిత్యజయ మంగళం ॥
గోవర్ధనగిరిని, లీలగానెత్తినట్టి, నీ చిన్ని చేతు
లకు నిత్య జయ మంగళం ॥
పూతన. పాపములను, పాలతోపానము జేసిన
పావనమూర్తికిపుడు పరమశుభ మంగళం ॥
తనచిన్న నోటిలోనె, తనతల్లికి నన్నియు
జూపిన, మా మాయల బిడ్డ నీ కిదియే, మహిత
జయమంగళం ॥
జగమొండి రావణుని, ఖండించి వేసినట్టి,
కోదండపాణి కిదియే, దండిజయమంగళం॥
నీ గోను మాలోను, నిరతము వెలయునట్టి,
మా మురళీ మోహనపట్టికి, నిత్యజయమంగళం॥

వెన్నుని వలపలియురమున, చెన్నొందు చున్నయట్టి చిన్నారిలచ్చితల్లికి, నిత్య జయమంగళం ॥

మాలచ్చిమగనియెడమ చేతిలో చెలగుచుండెడు శ్రీ పాంచజన్యమునకు సర్వజయ మంగళం॥

మానాథుని వలపలికరమున తళతళమెరయునట్టి శ్రీ చక్రరాజమునకు, సర్వశుభమంగళం॥

నీవెడద వక్షస్థలమున, నిరతము వెలయునట్టి శ్రీవత్స, కౌస్తుభములకు, నిత్యశుభమంగళం॥

నీ కంబు కంఠసీమను, నవనవలాడుచుండెడు, వనమాలారాజమునకు నిత్యశుభ మంగళం ॥

నీ సన్ననిమధ్యమునను, సొగసుగ గట్టినట్టి, పచ్చని పైడివలువకు, పరమశుభమంగళం ॥

పాదాది కేశమువరకు, పరిపరి విధములైన
చిన్మయభూషణునకు నిత్య శుభమంగళం॥
వరదార్య గురుడుబట్టు వరపాదపద్మములకు,
నీ నామరూపములకు నిత్యజయమంగళం॥

గ జా రో హ ణ ం.

జ్ఞానభక్తులను రెండు కోరలతో, విజ్ఞానంబను
తొండముతో । శుద్ధాహంకృతియను నైరావత
మిదె యర్పించెద గైకొనుమా ॥

అ శ్వా రో హ ణ ం.

క్షీరసాగరమునందు జనించిన ఉచ్చైశ్శ్రవ
మను నశ్వమను। వాయ్వంశంబై యుండుటచేదా
నతివేగముగా బరుగిడెడు । మానసాశ్వమును
బుద్ధికళ్ళెముతో నీకు సమర్పణ జేసెదను,
గైకొని హాయిగ నెప్పుడుదీనిపై వీరవిహారము
జేయుమురా॥

## ర థా రో హ ణ ము.

పదిచక్రంబుల పది గుర్రంబుల, నెప్పుడు బరుగిడుచున్నట్టి । దివ్యరథంబును నీకర్పించెద, సానందంబున నెక్కుమురా ॥

## ఆం దో ళి కా

శమమును, దమమును, తపమును శౌచము. లనియెడు నాలుగు గొలుసులతో, బాగుగనమరిన కర్మయోగమను దివ్యడోలికల నూగుమురా॥

## నృ త్య ం.

భ్రూమధ్యంబను బృందావనమున సర్వేంద్రియములు గోపికలై, సుషుమ్నయనియెడు మురళినిగైకొని, గోపాలుడనై పాడగను॥ రాగవశంబున నింపుమీరగా, జేసెదునానానృత్యములన్ । భావతరంగిత లాస్యాభినయా, దుల దిలకింపుము శ్రీ లక్ష్మి, శ్రీ కృష్ణా ॥

గీ తం॥

శిరమను దుంభీఫలముననమరిన, బ్రహ్మదండి యను వీణగొని। పంచప్రాణంబుల తంత్రులుగా, నందునబాగుగ బిగియించి। ఏడుచక్రముల నేడు మెట్లుగను, కుండలినాధారము జేసి। నాదుశ్రోత్రముల శ్రుతులందిద్దెడు, చెవులుగనిరుగడ లమరించి,। ఓంకారంబును చక్కగమీటిన సప్త స్వరములనీనగను, ఆత్మగీతమును హాయిగ బాడెద వీనులవిందుగ విన(వమ్మా) వోయి

వాద్యం.

అనాహతంబను మధ్యకమలమున, నాత్మషట్పదము దిరుగుచును। ధ్యానమరందము ద్రావుచుహాయిగ (ఝుంకారంబును జేయగను) వీనులవిందుగ పాడగను॥ యానాదంబదినవనాడులలో, వివిధరూపముల వెలయగను। వీణావేణు

మృదంగము మొదలగు వాద్య ఘోషముల
వినిపింతుర ॥

శ్లో ౨౦.

కర్మయోగమను కామధేనువుకు, జ్ఞానయో
గమను దూడనిడి,। భక్తిరసంబను పిండినపాలను
ప్రేమతో నొసగెద ద్రావుమురా ॥

—పర్యంకం—

శుద్ధాంతఃకరణంబులనంబడు, నాలుగు
దంతపుకోళులపై। చక్కగనమరిన ధ్యానమంచ
మున, నాదిశేషుడను తల్పమునర । జ్ఞానంబని
యెడు శుభ్రవస్త్రిమును, చక్కగనలుగడ
లంబరచి। నవవిధంబులగు భక్తిసుమంబుల
నందుదట్టముగ వెదజల్లి, మెత్తగచల్లగ కమ్మగ
నుండెడు ప్రత్యగ్రూపుని చిన్మయుని। పర్యంకం
బుగగైకొనినాలో యోగనిదురలో నుండు
మురా। (నిందిరతో నిదురింపుమురా)॥

## ల క్ష్మి మం గ ళ ం.

కమలమధ్యమున కళకళలాడె, శ్రీ దేవికిదే మంగళము। చిన్మయభూషణ భూషితమగు, మీా దివ్యమూర్తికిదే మంగళము ॥

మాకును మీాకును, ఎడతెగకుండెడు, బంధు భావనకు మంగళము। మమ్ముల దేవుని యొడిలో జేర్చిన, కరుణామూర్తికి మంగళము ॥

పురుషార్థంబుల నన్నియునొసగిన, చేతులకిదె శుభమంగళము। సర్వకాలములు మాలో వెలిగెడు, చిన్మయ జ్యోతికి మంగళము ॥

వెన్ను నివలపలి యురమున మెరసెడు, కమ్మని కొమ్మకు మంగళము। వాసుదేవుడను చెట్టున బర్విన, మల్లెతీగకిదె మంగళము ॥

మూాడులోకముల ధగధగ వెలిగెడు దివ్య జ్యోతికి మంగళము। మంగళము జయమంగళము మంగళము శుభ మంగళము ॥

## ప్రదక్షిణం.

దివ్యతేజమును నాలుగుదిశలను, ప్రసరణ జేయుచునున్నట్టి । వివిధరూపముల దశదిశలందును, నెప్పుడు కనబడుచున్నట్టి ॥

నీపార్శ్వంబుల, నీదుముంగటను, నీదువెనుకటి భాగమునఁ । సర్వరూపుఁడై యుండెడు నీకిదే, సుప్రదక్షిణము నర్పింతుఁ ॥

## గురుమంగళం.

మూడుదేహముల ముద్దుగదిద్దిన, పాదంబులకిదెమంగళము। కంటికి జ్ఞానాంజనమును నలదిన, చేతులకిదె శుభమంగళము ॥

దర్శనంబుననె దివ్యశక్తులను, మాలో ప్రసరణజేయు । దివ్యంబగు మీ కన్నుదామరల కిదియే, మాజయమంగళము ।

సర్వశాస్త్రముల సారముదెలిపిన, పలుకు

లదియే మంగళము। తలచినవెంటనె దర్శనమొస
గెడు, సద్గురుమూర్తికి మంగళము ॥
దేవునిగాంచెడు దీపమునొసగిన, దివ్యజ్యోతికి
మంగళము । కంటిపాపలో కళమైవెలిగెడు,
చిన్మయమూర్తికి మంగళము ॥
శ్రీకరమంత్రము మాకునొసంగిన, శ్రీ గురు
మూర్తికి మంగళము । వరమునొసగిన వరద
మూర్తికి దె, మంగళము జయమంగళము॥
వరదరాజహృత్పంకజ విలస, ద్రాజాంబకి దే
మంగళము । వరదరాజ రాజాంబికబిడ్డల, మగ
మాకిదియే శుభ మంగళము॥
మంగళము జయమంగళము మంగళము
శుభ మంగళము॥

ప్రార్థన.

వేకువజామున (సంధ్యావేళల) నరుదెంచి
నీ బంగరుపాదసరోజములన్ । చేకొని మదిలో

నుంచుకొని, ధ్యానించుటకు కతమేమో॥ విన్న
వించెదము వినవోయి, (వినవమ్మా) సావధాన
ముగ మా మొరను ॥ ఆవుల వెంటనుదిరుగుచు
దినిమెదు, నజ్ఞులకులమున జన్మించి, ప్రేమతో నీవే
మాకు నొసంగెదు, కానుకలెప్పుడు వలదనము॥
ఇంతమాత్రమున తృప్తులమై మే, మెన్నటికైనను
మనగలమా । కావున నెప్పటికెన్నిజన్మముల,
కైనను నీతోడిదే లోకం ॥ నిన్ను విడచి యొక
నిమిష మేనియును, మనజాలము ఇదినిక్కమురా।
సర్వదేశముల సర్వకాలముల, సర్వావస్థల,
నీచరణ । కమల సేవలను జేయుచునుందుము,
సానందంబున గోవిందా ॥ మరెట్టి కామముల
కలలోనైనను, కోరమునిక్కము గోపాలా ।
అన్నిసమయముల నన్ని భోగముల కలసి
భుజింతము శ్రీకృష్ణా। చేరి భుజింతము శ్రీలక్ష్మీ॥

## న మ స్కా ర ం.

కర్మేంద్రియముల నైదును పొందుగ, జ్ఞానేం
ద్రియములతో జేర్చి । జ్ఞానేంద్రియముల నింపు
మీరగా పంచప్రాణంబుల గలిపి॥

ప్రేమమీరనా ప్రాణపంచకము, మనసు న
మేళనగావించి । మనసునునాలో నేకము జేయుచ
నీపదములనను నర్పింతును ॥

సుగణపుష్పపూజ, అష్టకమలపూజ,

(మూ లా ధా ర ం)

సుగుణపుష్పము లెల్ల సొంపుగా విడిపించి,
నీదు పూజలమేము నేడుచేసెదము ।

(1) • నాదుమూలాధార కమలకర్ణికయందు,
నీదివ్యరూపమే నిండుగానిలిపి ॥
సర్వభూతములందు త్రికరణంబులతోడ,
నెట్టిహింసను గొనని మొదటిపుష్పమును ।

మనసుతో విడిపించి మమతదూరము జేసి,
నీపాదకమలముల నిపుడు నునిచెదను ॥
నాల్గుదళముల వెలయు బీజముల నాల్గుగొని,
నీ దివ్యమంత్రమే పాడుచుండెదను ॥
ప్రాణేంద్రియాదులగు ప్రమథగణములకివె,
పతియు నైనామూల పద్మమున వెలసెదవు॥
మాదు పూజల నెల్ల మనసార దిలకించి
మమ్మలరఁ జేయుచును మము మనుప వయ్యా।
నీల మేఘశ్యామ, నిఖిలమంగళ ధామ,
భక్తజలనిధిసోమ భవ్యగుణధామా। రామ ।
గురువరద యోగివర మమదురిత సంఘహర,
భక్తజన ప్రీతికర భవబంధదూరా ॥
నీలమేఘశ్యామ (గురువరద)॥

(2) నాదు స్వాధిష్ఠాన, కమలకర్ణికయందు,
నీ దివ్య రూపమే నిండుగానిలిపి ।

ఇంద్రియంబుల నణచి, విషయములబోనీక,
నిగ్రహంబనుపువ్వు నీకు సర్పింతుర ॥
ఆరుదళముల వెలయు, బీజములనారుగాని,
నీదివ్య మంత్రమే పాడు చుండెదను,
నాల్గు వేదముల నెడు నాలుముఖములుగల్గి,
హంసవాహనుడైన గురుబ్రహ్మ నిలిపి ॥
సర్వేంద్రియంబుల నిన్ను భజియించెదను,
వాణితో గురుమూర్తి నీవ వెలయుదువు ॥
నీలమేఘశ్యామ (గురువరద)॥

(3) నాదివ్య మణిపూర కమలకర్ణికయందు
నీ దివ్యరూపమే నిండుగా నిలిపి
సర్వభూతములందు, దయయనెడు పువ్వుగాని,
స్వ పర భేదము లేక, దయనుజూపుచును ।
కుండలీంద్రుండనెడు, నాదిశేషుని మీాద,
నిందిరతో వెలసేటి, గురువాసుదేవా ।

పదిదళంబుల వెలయు, బీజముల పడియుగొని
నీదివ్య మంత్రమే, పాడుచుండెదను ।
నాదు కుండలిచిలువ మూడుచుట్లుగ దిరిగి
నీదివ్య సింహాసనముగ వెలుగొందుగ ।
అందునీ వందముగ సొందుగాగూర్చుండి
మాదుపూజలనంది మమ్మ్మదయజూడు ॥
నీలమేఘశ్యామ (గురువరద)॥

(4) నాదు దివ్యానాహ తాఖ్యకమల మునందు
నీ దివ్య రూపమే నిండుగానిలిపి ।
త్రికరణంబులయందు క్షమయనెడు పువ్వుగొని।
మానావమానాది ద్వంద్వములనోర్చి,
సర్వమంగళతోడ సర్వాశంకరుడైన
నాదు గురుమూర్తినే పూజచేసెదను,
ఇంద్రియంబులుపదియు, మనసుబుద్ధియు రెండు
పన్నెండు దళములై సొంపుగానుండు,

ఇందులో వెలసేటి బీజముల నేనుగొని,
నీద్వాద శాక్షరినె పాడుచుండెదను ॥
నీల మేఘశ్యామ (గురువరద)॥
(౬) నాదు దివ్యవిశుద్ధ కమల కర్ణికయందు
నీదివ్యమూర్తినే నిండుగా నిలిపి।
త్రికరణంబులతోడ శాంతియను పువ్వుగొని
రాగ ద్వేషాదులను రహితంబు జేసి
పదునారు దళములై వెలయుచిత్కళలందు।
ఆన్తర జ్యోతియై యమరియున్నట్టి।
నీదివ్య జ్యోతిలో నాదుకళలను జేర్చి
నీశుద్ధ చిన్మూర్తి నేనుపూజింతును।
పదునారు దళములలో, నారుపది బీజముల
చేర్చిచక్కగ నేను షోడశాక్షరిని, పాడుచును
నీదివ్య మంత్రమును హాయిగాచేసెదము
మీపూజలింపు మీ ర గ ను ॥
నీలమేఘశ్యామ (గురువరద)॥

6 భ్రూమధ్య మందుగల, నాజ్ఞయనుకమలమున,
నీ దివ్య రూపమే, నిండుగానిలిపి ।
త్రివిధకరణములందు, స్థిరముగా విలసిల్లు,
త్రివిధమగు తపములను, పువ్వులనుగొనుచు।
దివ్యపరాశక్తి రాధతోగూడుకొని,
ఆటలను పాటలను దేలుచున్నట్టి ।
కృష్ణ యోగేశ్వరుని వరదగురు వరవిభుని
ఇంపు మీరగ నేను పూజచేసెదను ॥
రెండు దళములయందు బీజముల రెండుగొని
నీదివ్య మంత్రమే పాడుచుండెదను ।
బీజముల రెంటితో జయవిజయులనుమతిని,
నొసగ శ్రీ వైకుంఠ పురముజేరెదను ॥
నీలమేఘశ్యామ (గురువరద)॥

(7) నాదుదివ్యంబైన భ్రామరీ కమలమున ।
నీదివ్య రూపమే నిండుగానిలిపి ।

షట్పదంబులతోడ హ్రీంకారబీజమును ।
ధ్యానమును జేయుచును ధ్యానపుష్పమును।
మనసుతో విడిపించి మమతదూరము జేసి,
నీదివ్యజ్యోతినే పూజచేసెదను।
నీలమేఘశ్యామ (గురువరద)॥

(8) నాదుసహస్రార దివ్యకమలమునందు ।
నీదివ్యమూర్తినే నిండుగా నిలిపి,
త్రికరణంబులయందు నేకరూపతవెలయ ।
సత్యపుష్పముగొనుచు సొంపుమీరగను,
పరులమానసములకు నింపుగను, హితముగను,
ప్రియముగానుండేటి పలుకు పలుకుచును.
వేయిదళముల వెలయు వేయి మంత్రంబుల ।
నీదు పూజలమేము నిర్మలంబుగను ।
చేసెదము నీవిపుడు చిన్మయానందమై

నాదుసహస్రార కమల మధ్యమున
కోటివిద్యుత్ప్రభల వెలిగెదవు నీలోన ।
లీనమై హాయిగా నెపుడు నుండెద ను॥
నీలమేఘశ్యామ (గురువరద)॥

## సా క్షా త్కా ర ము

(1) కంటికంటి మరికన్నులపండుగ, బంగరు మేనిని గనుగొంటిరె । బంగరుమేనిలో తళతళ మెరసెడు, విద్యుల్లతనే గనుగొంటిరె ॥

జ్ఞానజ్యోతుల జిమ్ముచునుండెడు, చక్రరాజమును గనుగొంటిరె । ఓంకారంబును, వెలయించెడునా పాంచజన్యమునునేగంటిరె ॥

తళతళలాడుచు నురమున వెలసెడు, వన

మాలికనే గనుగొంటిరే । వక్షస్థలమున నిగనిగ లాడెడు, కౌస్తుభరత్నము గ ను గొ ం టిరే ।

నీలాంబుదమున నెలకొనియుండెడు, విద్యుత్ప్రభ యోాయన్నట్లు । నడుమునగట్టిన పీతాంబరమును, కనులపండువగ గనుగొంటిరే ॥

మకుటమాదిగా మంజీరాంతము మణిగణ భూషణ భూషితుని । పాదము మొ ద లి డి, యా కేశాంతము, కనులపండుగా గాంచితిని ॥

తిరుక్కండేన్, పొన్ మేనికండేన్ । తిగళుమ్ మరుక్కనణి నిరముంకండేన్ । శెరుక్కిళరుం పొన్నాళి కండేన్ । పురిశంగం కై క్కండేన్ ఎన్నాళి వణ్ణంబాలిను ॥

## అనన్యభావన - శరణాగతి

నీవునాకు తోడు లే, నిన్ను విడచి పోను లే,
నీవునాకుతోడై యుండ నెవరితోనాకేమి లే ॥ప॥
పరుల వేడ బోను లే, ఫలము కోరరాను లే,
కరుల, విరుల, పరుల, సిరుల, గొలువలేను లే ॥ప॥
ఒక్క వేల్పు నీవు లే, నీభక్తికి జిక్కినాను లే ।
నక్కతోక పట్టుకొని, నదిని దాటబోను లే ॥ప॥
దారితప్పి పోను లే, నీ దాసురాలను నేను లే।
కోరి కోరి నీదుసేవ గురిని నిలిపినాను లే ॥ప॥
వాసుదేవుడు (గురువరదుడు) నీవులె, నీ
దాసురాల(డను) నేనులె । వాసిగమన కిద్దరికిని,
బాంధవ్యము కలసింది లే ॥ప॥
చందురుడవునీవు లే, చంద్రిక యును నేను లే,
చంద్రచంద్రిక లొకటైయుండ అందరికిని
సుఖము లే ॥

## ఆ త్మా ర్ప ణ ం.

అడియే అడియే, ఆచార్య తిరువడిగళు కడియే ॥ ప ॥

మృదుమధురంబగు తిరువడియే । మూలము మనకు తిరువడియే। మోక్షప్రదము తిరువడియే॥ పద్మసుందరము తిరువడియే, పరమాధారం తిరువడియే, పరమపావనము తిరువడియే ॥ప॥

దాసోహంబును తిరువడియే హంసోహంబును తిరువడియే, ఆధారంబును తిరువడియే ॥ప॥

శ్రీవరదార్యుల తిరువడియే, వ ద ల క మ న ము తిరువడియే, ఆ త్మ లో ని లి పి తె అందును మోక్షం ॥ ప ॥

## స ద్గు రు సా క్షా త్కా ర ం.

కంటిని నేను, కనుబొమలనడుమ, శ్రీగురు మూర్తిని నేడు, కంటినీ నేను ॥ ప ।

కల్లగాదు ఇది కలనిజమాయను, దివ్యకాన్తి తో శోభిల్లెనే । కనులపండువగ గనుగొని యల రితి, సద్గురుమూర్తిని గనుగొంటినే ॥ ప ॥
నేగంటినే ।

చూపులలో చూపు, చిన్మయ రూపై నిలచెనే । నీల మేఘశ్యామల మూర్తివలె ॥ ప ॥
కాలమేఘమున, మెరుపుతీగవలె, నాయుర మున శోభిల్లెనే, నాయురమున రాజిల్లెనే ॥ప॥
చూచినయంతనె స్థూల రూపము తో, చిన్మయరూపుడై శోభిల్లెనే । చూచుచునుండగ కదలిక గలిగెను, కన్నుల యెదుట నే చిత్ర ముగా ॥ ప ॥

పావనుడైన వరదుడయాళుని, యేమని కొని యాడుదు నేను ।నే నైమె మరచిన యంతలో నాలో లీనంబై నిలచెనే ॥

## శ్రీ పాద తీర్థము.

విరజానదిలో దివ్యజలంబుల, హృదయకోశ ముననే నింపి । శమదమాదులను, కేసరి కర్పూ రాది, సుగంధంబుల జేర్చి॥ జ్ఞానభక్తులను రెండు కరంబుల, నీచరణంబులనుంచుకొని । నాదు హృదయసామ్రాజ్య పీఠమున, నేనభిషేకము గావింతుగా ।

ఆయభిషేకామృతమును ద్రావుచు, జనన మరణముల నెడబాసి । నీతోహాయిగ పరమ పదంబున, సానందంబున నేనుండుగా॥

కావున గురువర మీపదతీర్థము, మాకు నొసంగుము దయతోడగ । భీకరమగు మా భవరోగంబున, కిదియేచక్కని యౌషధము॥

పంచహారతి

నాదగు పంచజ్ఞానేన్ద్రియముల, బ్రహ్మతేజ

మున వెలిగించి। పంచోపనిషన్మయమై వెలసెడు దివ్యాద్భుతమగు రూపమును ।

సర్వవిధంబుల ననుభవించుచును, తన్మయంబులుగ జేయుటకు, పంచహారతుల నీ కర్పించెద కాంచీవరదా! గైకొనుమా ॥

## చతురారతి

మనసును బుద్ధియు చిత్తమహంకృతి, యనియెడు నాలుగుజ్యోతులలో। నాలుగు పురుషార్థంబులనంబడు, కప్పురగుళికలనేనుంచి । ఆత్మీయంబగు జ్ఞానజ్యోతితో, నింపుగనంతట నంటించి, నాలుగుహారతులర్పణజేసెద దనన్నియునీలో లీనముగన్ ॥

## త్ర్యారతి

మూడుదేహముల నిర్మలంబులుగ, సువిశుద్ధంబులుగావించి। ఆత్మీయంబగు దివ్యతేజమును,

నందున చక్కఁగ వెలిగించి। నీదివ్యంబగు మూడు రూపముల, మూడుకన్నులంగాంచుటకు, ముక్తి నొసంగెడు మూడు తేజముల మంగళహారతి
సర్పింతుఁగా ॥

జ ం ట హా ర తి

బుద్ధియు మానసమనియెడు, బంగరు, చిన్ని జోతులను, గ్రహియించి। శుద్ధాహంకృతియను పళ్ళెరమున, చక్కఁగ నిరుగడలందుంచి ॥ పరమ భక్తియను తరగనికపిలా, ఘృతమును, నందుననే నింపి। శుద్ధచిత్తమను పత్తితో జేసిన, పువ్వొత్తు లనే నందుంచి। ఆత్మీయంబగు జ్ఞాన జ్యోతిని నిరుపార్శ్వంబుల వెలిగించి, జంటహారతుల నర్పణజేసెద తంటలదీర్పుము గోపాలా।
గురువర్యా!

